# రుద్రాక్ష మహిమ
# విభూతిధారణ
## (విధి)



ప్రకాశకులు :

శ్రీ గాయత్రీ సాహిత్య విజ్ఞాన కేంద్రము

ఆర్యాపురం - మధ్యవీధి - రాజమండ్రి-4.

 1991 వెల రు. 15-00

శ్రీ గాయత్రీ

సాహిత్య విజ్ఞాన కేంద్రము

వ్యవస్థాపకులు :

శ్రీ గాయత్రీ బాబా

గాయత్రీభవన్, ఆర్యాపురం

మధ్యవీధి - రాజమండ్రి - 4.

ముద్రణ : 2000

ముద్రణ :

లలితేశ్వరి ప్రింటర్స్,

ఇన్నీసుపేట ఆంధ్రాబ్యాంకు వెనుక,

రాజమండ్రి.

ఫోన్ : 71079

# రుద్రాక్ష - విభూతి మహిమలు

## పరిచయము

రుద్రాక్ష విషయము :- ప్రపంచములో మానవజన్మ గొప్పదని పెద్దలందురు. మానవుడై పుట్టిన దేహధారి తన దేహము ను తనలోన మలిన గుణములతోనున్న యపరిశుద్ధమగు నాత్మను శుభ్రపరచుకొనినచో నిహపరములు సులభముగా లభించును. మనుష్యుడు శరీరశుద్ధికై నిత్య స్నాన మాచరించవలెను. సదాచారమును పాటించవలయును. దేహములో జీవి చిరకాల ముండుండ కోరికలగలవారు యనగా చిరకాలజీవితము కోరువారు కొన్ని నియమములు పాటించవలెను. ఆ నియమములలో భస్మధారణము. రుద్రాక్షధారణము పూర్వము నుండి ప్రసక్తి గాంచినది.

రుద్రాక్షలలో పెక్కురకములున్నవి. అందులో నేకముఖి, ద్విముఖీ యగు రుద్రాక్షలు ప్రశస్తమైనవి. వాటి ప్రశస్తి తెలియవలయునన్న రుద్రాక్షను బంగారము గీటుగీసినట్లుగా నరుగదీసిన మేలిమివర్ణము వచ్చు రుద్రాక్ష ప్రశస్తమైనది. ఈ రుద్రాక్షలు మాలగా వెండితో గాని బంగారముతోగాని రాగితోగాని పొదగజేసి మెడలో మాలగా ధరించదగును. రుద్రాక్ష ధరించినవారు శివస్వరూపులుగా నుందురు. కొందరు శిరస్సు చుట్టు వేష్టనము క్రిందను, కొందరు చెవుల కాభరణము క్రిందను కొందరు కంఠము చుట్టు మాలగా గాని యేకరుద్రాక్షను బంగారముతోగాని కంఠాభరణముగాను ధరింతురు.

రుద్రాక్షధారణము వలన ప్రయోజనము శాస్త్రీయముగాను, పౌరాణికముగను పెక్కులు గలవు. శరీరమున రుద్రాక్ష ధరించి ప్రాణము వదిలిన యే జీవియైన శివసాయుజ్యము పొందుదురని పురాణములు ఘోషించుచున్నవి. ఇక శాస్త్రీయ విమర్శకు దిగితిమా రుద్రాక్షధారణమున శరీర కాంతి పెరుగును. రక్తనాళములలోని మలినము విడిపోవ జేయును. గుండె జబ్బులు, నరములకు, శల్యములకు పట్టిన నీరసము దోషము హరింపజేయును. మన భారతీయ సంస్కృతిలో నాచారముతో చిరకాల జీవత్వమునకు వీలుగా సదాచారములు నిర్ణయించినారు. వాటిని మరచినను నిర్లక్ష్యము చేసినను మనము యీ శరీరమును కోరినంతకాలమాయుర్దాయ భాగ్యమునకు నోచుకొనకపోవుటయో, రోగపూరితము గావించుటయో జరుగక తప్పదు, అందుచేత రుద్రాక్ష మహిమ అనంతమని దేవీ భాగవతములో వివరింపబడినది.

భస్మధారణము :- భస్మధారణకూడా స్నానమైన తరువాత శరీరమున కద్దుకొనవలయును. ఈ భస్మమేమి ? మనము శరీరమునకు వ్రాసుకొనుటయేమి ? యతి నవనాగరికులు యేహ్యముగా చూతురు. శరీరములో వాత, పిత్త, శ్లేష్మములను త్రిధాతువులున్నవి. వాత, శ్లేష్మములు రక్తములో బలహీనత యున్నప్పుడుగాని, రక్తము వేడివలన గమనవేగమందున్నప్పుడుగాని దాని యుష్ణతము తగ్గించవలయునన్న భస్మధారణము ముఖ్యవిషయము. స్నానాదులొనరించిన వారు భస్మమును ధరించినచో శరీరములోని

తడినార్చి రక్తగమనమును సాఫీగా వేడి తగ్గించి నాడీమండలమున కందించి సదారోగ్యవంతులుగా చేయును. పతంజలి మహాముని యోగశాస్త్రములో యోగ మవలంబించునప్పుడు గొన్ని యాసనములు వేయునప్పుడుగాని భస్మము ధరించినచో శల్య సంధులలో నిరుకుకొని యున్న మలినము నాసనమున ద్వారా బయటకు వచ్చినప్పుడు బట్టతో తడి యొత్తినట్లు భస్మధారణముతో నా మలినమును పీల్చివేయును. ఇది శాస్త్రీయ దృక్పథము. పౌరాణికముగను వేదసమ్మతముగను మంత్రపూరితముగా భస్మమహిమ నిట్లు వర్ణింపబడినది. శివుని మూడవనేత్రము ద్వారా సృష్టింపబడిన దానిని త్ర్యంబక మందురు.

అట్టి త్ర్యంబకమనబడు విభూతిని సుగంధముతో మందునదియు, శరీరమునకు పుష్టినిచ్చునదియునై దోసపండు తొడిమ దానంతటది యూడినట్లు మృత్యువునుండి నన్ను విడదీయుగాక! యను మంత్రార్థములోని యర్థమును గ్రహించినవారు భస్మధారణ మవశ్యమాచరించి సత్ఫలితము లందెదురు గాక!

యాజయాభవః

లోకా స్సమస్తా స్సుఖినోభవంతు!

—గాయత్రీ బాబా

—•••—

# గాయత్రీ మంత్రము

। । ॥

ఓమ్ భూర్భువస్స్వః తత్సవితుర్వరేణ్యమ్

। । । ॥

భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్

ఓం = ప్రణవాత్మక స్వరూపమైన పరమాత్మః భూః = ప్రాణమునకు ప్రాణము; భువ = సర్వదుఃఖములను పోగొట్టి, స్స్వః = సమస్త సుఖముల నిచ్చునట్టి; యత్ = ఏ పరమాత్మ, నః = మాయొక్క, ధియః = బుద్ధులను, ప్రచోదయాత్ = ప్రేరణచేయునో, తత్ = ఆ; సవితుః = సర్వజగత్తులను సృష్టి చేయు, దేవస్య = దివ్యమహిమగల యాపరమాత్మ యొక్క; వరేణ్యమ్ = మిక్కిలి శ్రేష్ఠమై కోరదగిన; భర్గః = సర్వదుఃఖ నాశకరమగు శుద్ధ స్వరూపమును; ధీమహి = ధారణ చేయుదుము గాక.

ప్రణవస్వరూపుడును, అన్నిటికాధారమైనవాడును, అంతట నిండియుండువాడును, సర్వేంద్రియములను ప్రకాశింపజేయువాడును, సృష్టి స్థితి లయ కారణభూతుడును, సమస్త దుఃఖములను పోగొట్టి సర్వసుఖముల నిచ్చునట్టి స్వయంప్రకాశమైనవాడును నగు పరమాత్మునకు మా నమస్కారములు.

గాయత్రీ చందస్సు - అనుష్టుప్ శ్లోకము - మంత్రద్రష్ట, విశ్వామిత్ర మహర్షి.

ఓం తత్, సత్.

# శ్రీ వేదమాత ప్రార్థన

ఓ పూజ్య గాయత్రీ ! క్షమాపరిపూర్ణ ! ప్రేమమయీ !
నీకు నమస్కృతులు సాష్టాంగ ప్రమాణమములు !
నీవు సచ్చిదానందస్వరూపివి, సర్వాంతర్యామివి
సర్వ శక్తిమయివి, సర్వజ్ఞురాలవు,
సర్వజీవ హృదయాంతర్వాసివి,
కరుణార్ద్ర హృదయము, సమదృష్టి స్థిరమనస్సు
భక్తి, విశ్వాస, జ్ఞానములు మాకు ప్రసాదింపుము.
ఆకర్షణ లజగ్రదొక్కి చిత్తవృత్తుల నరికట్టుటకు
మాకు వలయు అంతరాధ్యాత్మిక శక్తి నొసంగుము.
మా హృదయఫలకములను సద్గుణములతో నింపివేయుము.
కామ, క్రోధ, లోభ, ద్వేషముల బారినుండి మమ్ము తప్పింపుము
ఈ సర్వనామ రూపములలో నిన్ను సేవింపనిమ్ము.
ఈ సర్వనామ రూపములలో నిన్ను తిలకింపనిమ్ము,
నిన్ను సదా స్మరించుకొనరిమ్ము.
నీ లీలలు సదా గానము చేయనిమ్ము
నీ నామము సదా మా పెదిమలపై నుండనిమ్ము
నీలో మమ్ము సదా వసింపనిమ్ము, నీకన్న మాకు వేరేదిక్కు కలదా!
అభీష్టములిచ్చి రక్షించుము. రక్షించుము. రక్షించుము,
సర్వజగ దుపకారముగా నూరేండ్లు మమ్ము బెంచుము.
ధర్మమునుండి మమ్ము జారిపోనీకుము.
నిన్ను దెలసి వర్ణింపనేరను.

ఓం తత్సత్.

వ్యవస్థాపకులు :



శ్రీ గాయత్రీ బాబా శ్రీమతి రాణెమ్మగారు

శ్రీ మహాగణపతయే నమః

శ్రీ వేదమాత గాయత్రీ దేవ్యై నమః



# రుద్రాక్ష మహిమ

## విభూతి ధారణ

## (సహితము)

రుద్రాక్షమాల మహాత్య మనంతమైనది. ఎవరు తన కంఠమున ముప్పదిరెండును, నుదుట నలుబదియు, నిరుకర్ణముల నాఱాఱు, రెండు చేతులయందు పండ్రెండు, పండ్రెండును, రెండు భుజముల యందు పదునాఱు, పదునాఱును, శిఖయందు నొకటియు వక్షస్థలమున నూటయెనిమిదియు రుద్రాక్షలను దాల్చునో, అతడు సాక్షాత్తు శంకర స్వరూపుడగును. వెండి, బంగారు, తామ్ర తీగలతో రుద్రాక్షలను అతికి ధరించవలెను. ప్రణవమంత్ర, ముతో పంచాక్షరీ మంత్రముతో రుద్రాక్షమాలను ధరించవలెను.

రుద్రాక్షమాలను ధరించుట వలన ఏమి లాభం ?

రుద్రాక్షలు ధరించుట వలన గుండె నీరసము, మధుమేహము, మొదలగు రోగములకు చాలా మంచిది. శివ విజ్ఞాన మభివృద్ధి చెందును.

ఎవరు ధరించవచ్చును ? విధానమేమి !

భస్మరుద్రాక్షదారు లుభయులను శివునకు నత్యంత ప్రియులగుదురు. భస్మరుద్రాక్షధారియై పంచాక్షరీ మంత్రమును జపించువాడు సంపూర్ణముగా శివ భక్తుడు కాదగును.

శ్లో॥ వినా భస్మత్రిపుండ్రేణ - వినా రుద్రాక్షమాలాయా,
పూజితోఽపిమహాదేవో - నాభీష్ట ఫలదాయక ॥

భస్మము నొసట మూడు రేఖలుగా ధరింపనిదే, రుద్రాక్ష మాలను కంఠమున దాల్చనిదే శంకరుని పూజించినను భక్తుని వాంఛలు నెరవేరజాలవు. కావున భస్మరుద్రాక్షమాలను ధరించియే పరమేశ్వర శంకరుని ఆరాధించుట శ్రేయస్కరము, లాభం, జయం, సర్వకామ సమృద్ధి గలుగజేయు భస్మరుద్రాక్ష ప్రభావమును మీ ప్రశ్న ననుసరించి శుభప్రదమై నద్దానిని భక్తితో వినిన వానికిని కామితంబు లన్ని యీడేరును. అట్టివారు జీవితమున్నంత వరకు సర్వవిధ సుఖంబు లనుభవించుటయే గాక పుత్ర పౌత్రాది వంశవృద్ధి గలవారై ముక్తులై శివ ప్రియులగుదురు.

అన్ని జాతులవారు రుద్రాక్షలు ధరింపవచ్చును. బ్రాహ్మ ణులు మంత్రములతో రుద్రాక్షలు ధరింపవలెను. ఇతరులకు మంత్రముల ఆవశ్యకతలేదు. వేయిమాటలేల ? దాని మహిమ అద్భుతము. ఎవరు రుద్రాక్షలు ధరింతురో వారు పరమపవిత్రులు.

కుమారుడు కన్న తండ్రిని నిందించిన ఎంత దోషమో రుద్రాక్షలను ధరించిన వారిని నిందించిన అంతదోషము. ఎవరు రుద్రాక్షలను ధరింతురో అట్టివారికి ద్రవ్యము, వస్త్రములు, ఆహారం నొసగి గౌరవించిన వారికి రుద్రలోకములో నివసించు భాగ్యము గలుగును. హారములలో రుద్రాక్షు ధరించినవారు చిత్తశుద్ధి పవిత్రతయు గలవాడగును. అలంకారములను ధరించుట కంటే రుద్రాక్షలను ధరించుట ఉత్తమము. రుద్రాక్షలను గురించి యెంత చెప్పినను తృప్తి తీరదు. అని శ్రీమన్నారాయణమూర్తి నారద మహర్షితో చెప్పినారు. అది నారదమహర్షి విని రుద్రాక్షకు ఆ మహిమ యెట్లువచ్చినది చెప్పుమని అడుగగా నారాయణుడు ఇట్లు చెప్పెను. నారదా ! పూర్వము ఇదే ప్రశ్న శివుని కుమారుడగు కుమారస్వామి అడిగినాడు. దానికి శివుడు చెప్పిన సమాధానము చెప్పుచున్నాను వినుము. పూర్వమందు త్రిపురాసురుడను పేరు గల ఒక అజేయుడయిన రాక్షసు డుండెను. ఆతడు వరగర్వముతో బ్రహ్మ, విష్ణువు మొదలగు సర్వ దేవతలను యుద్ధమున ఓడించినాడు. అపుడు వారందరును నా వద్దకు వచ్చి ఆ రాక్షసుని చంపుమని ప్రార్థించినారు.

వారి ప్రార్థన విని నేను సర్వదేవతల శక్తి ప్రవేశపెట్టి ప్రజ్వలించుచున్న కడు భయంకరమగు అఘోరమను ఒక అస్త్రమును నిర్మించినాడను, దేవతల రక్షణము, త్రిపురాసుర సంహారము సర్వవిఘ్న బాధల నివారణము చేయదలచి ఉన్మీలిత నేత్రములతో ఒక వేయి దివ్య సంవత్సరముల వఱకు ఆ అఘోర అస్త్ర నిర్మాణ విషయమును ఆలోచించు చుంటిని. ఆ సమయమున నా మూడు నేత్రములు అలసట చెందినవి. ఆ నేత్రముల నుండి నీటిచుక్కలు క్రింద పడసాగెను. నేత్రజలము యొక్క ఆ బిందువుల వలన పెద్ద రుద్రాక్ష వృక్షములు పుట్టినవి. ఇది రుద్రాక్షల పుట్టుక విషయము.

నా ఆజ్ఞవలన లోక హితమునకై అవి ముప్పది యెనిమిది విధములయినవి. నా కుడి కన్ను అయిన సూర్య నేత్రము నుండి 12 రుద్రాక్షలు గోరుజనపు రంగుగలవి. ఎడమ కన్ను అయిన చంద్రనేత్రము నుండి 16 రుద్రాక్షలు తెలుపురంగు గలవి. మూడవ కన్ను (ఫాలనేత్రము) అయిన అగ్నినేత్రము నుండి 10 రుద్రాక్షలు నల్లని రంగుగలవి, ఇందులో తెలుపురంగు గలవి. బ్రాహ్మణులును, ఎరుపు రంగుగలవి క్షత్రియులును మిశ్రమ వర్ణముకలవి వైశ్యులు, నల్లనిరంగుగల రుద్రాక్షలు శూద్రులును ధరించవలెను.

నారదా :

ఏకముఖమున్న రుద్రాక్ష శివునిస్వరూపము. అది ధరించుట వలన సమస్తపాపము నశించును.

ద్విముఖములు గల రుద్రాక్ష ధరించుట వలన హింసా దోషము లన్నియు హరించును.

మూడు ముఖముల రుద్రాక్ష ధరించి పూజించు వారికి సాధింపదగిన సత్కార్యము లన్నియు సర్వదా సిద్ధించు చుండును. అభ్యసింపబడిన విద్యలన్నియు రాణించును.

నాలుగు ముఖముల రుద్రాక్ష బ్రహ్మ స్వరూపమై సమస్త దోషములను నివారింపజేయును.

అయిదు ముఖములు గలది. రుద్రస్వరూపమై కాలాగ్ని అను పేరు గల్గియుండును. అపాత్రాదాన, భోజనాదుల వలన వచ్చు ఉపద్రవము లన్నియు శమించును.

ఆరు ముఖములు గల రుద్రాక్ష శ్రీ సుబ్రహ్మణ్య పరమేశ్వర స్వరూపము. అట్టి రుద్రాక్షను కుడిచేతిని కంఠమున ధరించినచో బ్రహ్మహత్యాదోషము తొలగును.

ఏడు ముఖములు గల రుద్రాక్ష అనంగ స్వరూపమయినది. అయ్యది దరించినచో సువర్ణము మొదలగు లోహములు దొంగిలించిన పాపము నివృత్తమగును.

ఎనిమిది ముఖములు గల రుద్రాక్ష గణపతి స్వరూపము. అది ధరించినచో గురుద్రోహాది పాతకములు పోవును.

తొమ్మిది ముఖములు గల రుద్రాక్ష భైరవస్వరూపము. దీనిని ఎవరు ఎడమభుజమున ధరించినచో నావంటి

వాడై భుక్తిముక్తికిని లోపము లేకుండగా సర్వపాపముల నుండి విముక్తుడయి పుణ్యాత్ముడగును.

పది ముఖముల రుద్రాక్ష విష్ణుస్వరూపము. ఇది ధరించుట వలన సమస్త భూత బాధలు తొలగును.

పదునొకటి ముఖముల రుద్రాక్ష ఏకాదశ రుద్రారూపము, దానిని ధరించువాడు అశ్వమేధ యజ్ఞఫలము నొందును.

పన్నెండు ముఖముల రుద్రాక్ష ద్వాదశాదిత్య రూపము, ఇది ధరించువానిని పన్నెండుగురు సూర్యులు అనుగ్రహ ప్రాప్తి గలుగును.

పదమూడు ముఖములు గల రుద్రాక్ష దొరకనే దొరకదు. దొరికినదా సీవంటి వాడగును. విశ్వే దేవతాత్మకమై సౌభాగ్య సౌమంగల్యముల నొనగూర్చును.

పదునాలుగు ముఖములు గల రుద్రాక్షమైతే పర శివ స్వరూపము ఇద్దానిని శిరసునం దిడుకొనినచో పాపము లన్నియు పటాపంచలగును.

క్రమముగా నివ్వానిని ధరించు మంత్రములు :- ఓం హ్రీం నమః, ఓం నమః, ఓం క్లీం నమః, ఓం హ్రీం నమః, ఓం హ్రీం నమః, ఓం హ్రీం హుం నమః, ఓం హుం నమః, ఓం హ్రీం నమః, ఓం హ్రీం హుం నమః, ఓం హ్రీం నమః ఓం హ్రీం హుం నమః, ఓం క్రొం క్షొం రొం నమః, ఓం హ్రీం నమః, ఓం నమః, మంత్రములను పాటించకుండా రుద్రాక్షలను

ధరించువారు దుర్గతుల పాలగుదురు. భూతప్రేత పిశాచములు ఢాకినీ శక్తులు, ఇతర ఘాతక జంతువులు, మంత్ర ప్రయోగాదులును రుద్రాక్షధారిని గాంచి దూరములగును. పరమశివుడు మహావిష్ణువు, జగదంబయు, గణాధ్యక్షుడును, సూర్యదేవుడు, ఇతర దేవతలు రుద్రాక్షధారిణి జూడగానే ప్రసన్నులగుదురు. అందువలన రుద్రాక్షలందగు మహిమను బాగుగా గుర్తెరిగి సమంత్రముగా తప్పక ధరింపవలసి యుండును.

సర్వాభీష్టములు నెరవేరును. భోగపూర్ణుడగును. పాపములు నశించును. రుద్రాక్షలను ధరించిన వారిని దేవత లెల్లరును పూజింతురు.

జపమాల యెట్టిదిగా నుండవలెనో వివరించెదను వినుము. రుద్రాక్షయొక్క ముఖభాగము బ్రహ్మ, మధ్యభాగము శివుడు, పుచ్ఛభాగము విష్ణువు అని తెలియవలయును.

ఎటువంటి రుద్రాక్షలైనను గుండ్రముగా ఉండవలెను. పుచ్ఛ సిద్రములు లేనివి కావలెను. మాలను గుచ్చునప్పుడు, పుచ్ఛముతో పుచ్ఛమును, ముఖముతో ముఖమును కలుపవలెను. మేరువు పూస పైన ఉండవలెను. నాగపాశముగా ముడి ఉండవలెను. అట్టి మాలిక (దండ) తయారు చేసికొని జపించిన, ధరించిన సిద్ధి గల్గును. స్నాన దాన జప హోమాది సమయములందు రుద్రాక్షలను ధరించుట ఉత్త

మము, రుద్రాక్ష చెట్టుగాలి సోకినంత మాత్రమున పుణ్యాత్ము లౌదురు. రుద్రాక్ష సమస్తదోషములు పోగొట్టునని జాబాలి మహా ఋషి చెప్పిన శ్రుతిలో నున్నది. తెలివి లేనివాడు కూడా రుద్రా క్షలు ధరించినచో అతడు వివేకవంతుడగును. ఎవరైనను నా నామ ములు జపించి రుద్రాక్షలను ధరించినచో వారు భగవద్భక్తి గల వారు కాగలరు. వారికి శుభ పరంపరలు గల్గును. కంఠమున రుద్రాక్ష ధరించిన కుక్క, కోడి ప్రాణావసాన సమయమున ముక్తినొంద గలవు. ధ్యానము, జపము, స్నానము లేనివారు పశువులవలె సంచరించువారు రుద్రాక్షలను ధరించిన మాత్రమున ముక్తినొంద గలరు. కంఠమున రుద్రాక్షమాలను, నుదుట విభూతియు లేకున్నచో వాడు వంశము నుద్ధరింపలేడు. ముక్తి పొందలేడు. కల్లుత్రాగినను, మాంసము తిన్నను, రుద్రాక్షలు ధరించినవాడు నరక లోకమునకు వెళ్ళడు.

భక్తితో రుద్రాక్షలు ధరించినచో అతడు సమస్త సత్కర్మ ములు చేసిన ఫలితములను పొందగలడు. నాలుగు వేదములు చదువుట, పురాణశాస్త్రములు గ్రహించుట - మొదలగు సమస్త పుణ్యములు రుద్రాక్షలు ధరించుట వలనే సిద్ధించును. అంత్యకాల మున ఎవరు రుద్రాక్షలు ధరించి ప్రాణము విడుచునో వారు రుద్ర లోకమున నివసించెదరు. బ్రాహ్మణులు గాని చండాలురు గాని, గుణవంతుడుగాని, గుణహీనుడుగాని, రుద్రాక్షలను ధరించినచో శివసాయుజ్య రూపము ముక్తిని పొందగలరు.

ఎవరు విడువకుండా సర్వకాలములందు రుద్రాక్షలను ధరించునో వానిని అందఱును పూజింతిరు. విద్యావంతుడుగాని విద్యాహీనుడుగాని భక్తితో దీనిని ధరించినచో శివపదము లభించగలదు. వారు కీటక గార్ధభమువలె నా వద్దకు చేరును. అని శివుడు కుమారస్వామితో చెప్పుచుండెను. అప్పుడు కుమారస్వామి శివుని ఇట్లు ప్రశ్నించెను. తండ్రీ! మహాదేవా! కీటక గార్ధభము అన్నారు. అదియేమి? కీటకమునకు గార్ధభమునకు రుద్రాక్షలు ఎవరు వీటిని ఇచ్చినారు? అవి ఎటుల ధరించినవి? మనోరంజకముగా నాకు చెప్పుమని కోరెను.

దీనిని గుఱించి ఒక యుదాహరణము చెప్పెదను వినుము కుమారా! పూర్వకాలమున కోసలదేశములో ఒక బ్రాహ్మణుడుండెడువాడు. ఆయన మిక్కిలి ధర్మాత్ముడు. ఆయన వేదము నభ్యసించినవాడు. ఆయన పేరు గుణనిధి. ఆయన కుమారుని పేరు సుధీషణుడు. అతడు సంతోషముతో గురుపత్నిని మోహింపఁజేసినాడు. ఈ విధముగా గురుపత్నిని గూడి కొంత కాలమునకు గురువునకు విషమిచ్చి చంపివేసినాడు. ఆమెతో రతిసుఖము లనుభవించెడివాడు. వాని తల్లిదండ్రులు ఇది మంచిపని కాదు. అని చెప్పిన మీదట వారికింత విషము పెట్టి వారిని కూడ చంపివేసినాడు. భోగము లందాశక్తి పెరిగినది. ధనమంతయు పోయినది. ఈ విధముగా దరిద్రుడయి పోయినాడు. అప్పుడు ఆ యూరిలోని బ్రాహ్మ

జులు ఇది అంతయూ చూచి "వీడు దౌర్భాగ్యుడు, ఇట్టి వానిని చేరదీయరాదు" అని తలచి వారందఱును వానిని వెలివేసి ఊరినుండి తరిమివేసినారు. అతడు ఆ యూరు విడచి ఆమెతో అరణ్యమునకు పోయి బోయవాడుగా సంచరించుట మొదలు పెట్టెను. వాడు ప్రతిదినము మద్యము సేవించుచు బాటసారులను చంపుచు ధనము సంపాదించుచుండెను. వాని చేతిలో ఎంతో మంది జనులు మరణించినారు. కొంత కాలమునకు అతడు కూడా మృతిచెందినాడు. ఆ మరణ సమయమునకు యమభటులు వచ్చినారు. అప్పుడే శివదూతలు వెళ్ళినారు. వారికిని నా భటుల కును వాదోపవాదములు కలిగినవి. అప్పుడు యమభటులు నా భటులను జూచి, ఓ శివదూతలారా వీడు దుర్మార్గుడు, మహా పాపి, గురుభార్యాసంగమము, తల్లిదండ్రులకు విషము ఇచ్చి చంపిన మహాపాపి. ఈ పాపాత్ముని మీరు తీసుకొని పోవుటకు ఎట్లు వచ్చినారు? అని ప్రశ్నించినారు.

అప్పుడు వారి మాటలు విని శివదూతలు వారితో ఓ యమ దూతలారా! వీడు ఏ ప్రదేశమున మరణించినాడో అచ్చట నేల త్రవ్వుడు అని చెప్పిరి. ఆ నేల త్రవ్వగా పది బారల లోతున ఒక రుద్రాక్షపూస ఉన్నది. ఇది అంతయు దాని మహిమకాని యింకొకటికాదు, ఆ కారణమున వీడు మహాను భావుడు అని చెప్పి విమానము మీద యెక్కించుకొని నా దగ్గ రకు తీసుకొని వచ్చినారు. నాయనా! ఇది రుద్రాక్ష మహిమ.

సర్వపాపములు హరించునది అని శంకరుడు కుమారస్వామికి చెప్పిన మీదట అతడు ఆనందభరితుడైనాడు.

మరియు "కుమారా! వింధ్యపర్వత ప్రాంతమున ఒక బాటసారి రుద్రాక్షమూటలు గాడిదపై వేసి వెళ్ళుచుండెను. అప్పుడా గాడిద బరువు మోయలేక ఆయాసపడి నేలమీదపడి ప్రాణములు వదలిపెట్టినది. వెంటనే ఆ గాడిద శరీరము వదలి మూడు కండ్లతో శూలము ధరించి నేనుండు చోటునకు వచ్చినది. అది నా దయ సంపాదించుకొన్నది. గాడిద బరువు మోయబడిన రుద్రాక్షలకు ఎన్ని ముఖములుండునో అన్నివేల సంవత్సరములు నా లోకములో నివాసము చేసెను. కుమారస్వామికి రుద్రాక్షధారణ శివుడు ఇంకను వివరించుచున్నారు.

కుమారా! ప్రతి దినము రుద్రాక్షలను ధరించినవారు శ్రీమంతులు అగుదురు. వారి పుణ్యము చాలా గొప్పది. వానితో సమానమయిన వారులేరు.

వేయి రుద్రాక్షలు ధరించిన వానిని దేవతలెల్లరు పూజింతురు. ఒక వేళ అన్ని రుద్రాక్షలు లభించనిచో 16 చొ॥ రెండు దండలకు, సిగయందు ఒకటి, చేతులయందు 12 చొ॥నను, కంఠమున 32 ను, తలచుట్టును 40 ను, చెవులకు 6 చొ॥నను, వక్షమున 108 యు, ధరించినవాడు శివునివంటి వాడగును. ముత్యము, పగడము, వెండి మొ॥నవి అందు ఇమడ్చి ధరించినవాడు నాతో సమానుడగును. రుద్రాక్షలు ధారణము

చేసినవాడు మద్యము. మాంసము, ఉల్లి, వెల్లుల్లి, మునగకాయ, విరిగికాయ మున్నగు నిషిద్ధ వస్తువులు దినగూడదు.

శిరిపురం అను గ్రామమున ఒక గృహస్తుడు కాపురం చేయుచుండెను. వానిపేరు రుద్రయ్య కడు పేదవాడు. అక్షర శూన్యుడు. ఆ తెలగాకులస్తుడు కోళ్ళను పెంచుచుండెను. వానికి ఒక రోజున ఒక రుద్రాక్ష దొరికెను. వానికి అది రుద్రాక్ష శివ ప్రీతి అయినదని తెలియదు. అందముగా ఉన్న ఒక కాయ అని భావించి దానిని దారమున బంధించి తన పెంపుడు కోడి మెడకు కట్టెను. అప్పటినుండి ఆ కోడి తేజోవంతముగా ఉన్నది. ఒక రోజున కోడిపందెము వేయసాగెను. ఒక్కవేటున ఎదుట కోడిని గెలిచెను. ఈ కాపువాని కోడికంటె మనకోళ్ళు బల మైనవి చురుకైనవి అయినను ఆశ్చర్యముగా కాపువాని కోడి పందెము గెలిచినదని ప్రజలు చెప్పుకొనిరి. ఆ రోజు మొదలు ప్రతిరోజు ఆ కాపువానికోడి మీద అనేకమంది వస్తాదైన కోళ్ళను పందెమువద్దగా అవలీలగా ఆశ్చర్యముగా మెరుపు దాడిలా ఆ కోడి అనేక కోళ్ళను హతమార్చెను. ఆ కాపు వాని కోడిని చూసి అసూయతో ఓర్వలేనివారై ఆ కాపు వానినీ ఆ కోడినీ రూపుమాప తలపడిరి. ఆ కాపువాడు ఆ కోడిని తన ప్రాణ సమానముగా పోషించుచుండెను. తన నివాసమగు పూరియింటి యందు తన పరుండుమంచముకోటికి కట్టెను. ఒక రాత్రినాడు పలువురు కుట్రపన్ని ఆ పూరియింటికి నిప్పుపెట్టిన కాపువాడు, వానికోడి చనిపోవును అని భావించి నిప్పు పెట్టిరి. వెంటనే

మంటలు చెలరేగి పూరిగుడిశ దగ్ధమైనది. మనపీడ ఇరగడైనదని భావించి ఆనందపడిరి.

పాపము ఆ కాపువాడు చనిపోయెను. ఉదయం ప్రజలు గుంపులుగా వచ్చి చూచుచుండిరి. విరోధముతో నిప్పుపెట్టిన వారు ఆనందముగా గుముకూడి కాలిపోయిన చుట్టుపాకవద్దకు వచ్చి తిలకించుచున్నారు. కాని కాలి ఆరిపోయిన ఒక స్తంభముపై కాపువాని కోడి ఎక్కి కొక్కొరోకో అని ఆశ్చర్యముగా కూయుచుండెను. విరోధులు అగువారు పైన ఉన్న కోడిని చూసి ఆశ్చర్యపోయిరి కాని, అగ్ని పెట్టిన కారకులను ఆ కోడి గ్రహించి రివ్వున పైకిఎగిసి ఒకని కన్ను తన్నివేసి మరల స్తంభము ఎక్కి కూయుచుండెను. మరల జనసమూహాములో తనకు తన యజమానికి చెడుతలపెట్టిన దుండుగలను తరిమి, వాళ్ళకళ్ళను పెరికి వేసెను. వాళ్లు అంధులైరి, ఇట్లు కుమారస్వామికి ఈశ్వరుడు చెప్పదొడగెను.

రుద్రాక్షలు విభూతి ధరించిన వారిని కీడుతల పెట్టిన, దూషించినా, హేళనచేసిన, దుర్గతి పాలగుదురు,

రుద్రాక్ష మహిమ చాలాగొప్పది. పంచాయితనమనగా శివ, హరి, అంబికా. ఆదిత్య గణపతి స్వరూపము పంచముఖ రుద్రాక్ష, సర్వకాల సర్వావస్తలయందు రుద్రాక్షలు విడువరాదు. కలియుగమున కాలమంతయు దోషములచే నిండి యుండును గావ పార్వతీదేవితో పరమశివుడు ఇట్లనెను.

పార్వతీ ! మానసిక పాపములు వాచిక దురితములు కాయిక దోషములు మరియు చేసినమేలు మఱచువారును నిర్దయులు. కపటస్వభావులు లుబ్ధులు వక్రమనస్కులు ఎట్టి వారైనను నా యందు ఆసక్తి గలవారగునెడల పంచాక్షరీ మహా విద్య రుద్రాక్షధారణ విభూతి ధరించుట వలన సంసార బంధము నుండి విముక్తులగుదురు. ఈ మంత్రమునకు - బీజము ఓంకార మనియు, నమః అనునది శక్తి యనియు, శివాయ అనునది కీలక మనియు, వామదేవుడు ఋషియనియు, పంక్తి యనునది ఛందస్సనియు, దేవత - శివుఁడనియు, గౌతముడు, అత్రి, విశ్వామిత్రుఁడు, అంగీరుఁడు, భరద్వాజుడు ననువారు నకారాది పంచవర్ణములకు ఋషులుగా చెప్పబడుదురు. గాయత్రి అనుష్టుప్ బృహతి విరాట్ దేవతలు, నా ఐదు ముఖములు పంచ వర్ణములకు స్థానమగును.

పెక్కు చెప్పనేల ? నా భక్తుడు ఈ మంత్రమును జపింప నధికారము కలిగియుండును. వేదములు మహర్షులు నీ మంత్రముఁదగు మహిమపై ఆధారపడియున్నవి. ప్రళయము సంభవించు తఱి చరాచర ప్రాణులందరు నీ పంచాక్షరి నవలంబించియే సూక్ష్మరూపమున మనుచుందురు. కాని యప్పుఁడు నే నొక్కడనే భాసించుచుందును. గాన నాలో పంచాక్షరియు, పంచాక్షరితో సమస్తంబు దాగియుండునని తెలియవలెను. మహాప్రళయమున నారాయణుఁడు మాయాశరీరుఁడై శేషశయమున నుదకమునందు పరుండగా నాతని బొడ్డులోనుండి

యుదయించి కమలమునందు పితామహుడు బ్రహ్మ జన్మించెను. అతడు ముల్లోకముల బుట్టింపదలచి అందుకు నుపాయము గానక మొదట పదుగురు మునులను పుట్టించి వారికి సృష్టిశక్తి చేకూరుటకై నన్ను ప్రార్థింప నేను ఐదు ముఖములనుండి ఐదక్షరములను బోధింపగా కమలాసనుడు పంచ ముఖములతో పంచాక్షరముల జలికి నన్ను సూటిగా చెప్పునది పంచాక్షరమేననియు గుర్తించి తన కుమారులకు నీ మంత్రమునే ఉపదేశించెను. ప్రాణులందరు స్వీకరించి యనుష్ఠించియు కృతార్థులు కావలెనని సర్వజ్ఞుడగు పరమాత్మ "ఓం నమః శివాయ" అని విశదముగా పలికెను. మరియు నీ షడక్షరీ విద్యలన్నిటికిని మూలమై మంత్రము లన్నింటి కంటె మొదటిదై మఱ్ఱివిత్తనమువలె సూక్ష్మమైనది.

గుణత్రయము నతిక్రమించినవాడు సర్వకర్తయు మహా ప్రభువునగు శివుడు "ఓం" అను ఏకాక్షర మంత్రము నందుండు టయేగాక ఈశానాది పంచబ్రహ్మ రూపములతో పంచాక్షరము లందు నివసించుచున్నవాడు అనగా ? ప్రణవఘటిత శివ పంచాక్ష రిని పరిగ్రహించినచో సద్యోజాత వాసుదేవ అఘోర తత్పురుష ఈశానాఖ్య పంచబ్రహ్మ మయుఁడగు శివుడు - లభించినట్లే యని భావము.

సగర్భజపమునకన్న ధ్యానముతో కూడిన జపము శ్రేష్ఠ మగును. వాచిక ఉపాంశు, మానస సగర్భ సంధ్యానములగు

పంచవిధ జలములలో తన శక్తికొలది ఏదో ఒక విధమగు జపముఁ చేయవచ్చును. పాణిరేఖలపై చేయబడు జపము- ఎనిమిదిరెట్లు ఫలము నొసగును. శంఖములతో వందరెట్లును, పగడములతో వేయిరెట్లును, స్ఫటికములతో పదివేల రెట్లును, ముత్తెములతో లక్షరెట్లును, తామరపూసలతో పదిలక్షల రెట్లును, బంగారు పూసలతో కోటిరెట్లును, దర్భముడులతో రుద్రాక్ష మాల తోడను అనంతమగు ఫలం చేకూరును. ముప్పది పూసల మాలిక - ధనము నొందవచ్చు. ఇరవైయేడు నక్షమాలిక పుష్టినొసఁగును. పంచవింశత్యక్ష మాలిక ముక్తి ప్రదమగును. పదునైదు నక్షముల మాలిక అభిచార ఫలము నిచ్చును. జప మాలిక - బొటన వ్రేలుపై త్రిప్పఁబడునెడ మోక్షపదంబునగు చూపుడు వ్రేలుపై జపింపఁబడునెడ శత్రువులు నశింతురు. నడిమి వ్రేలుపైని జపము - ధనము నొసఁగును. అనామిక వ్రేలుపైని జపము - అరిష్టములను శాంతింపజేయును, నూటయెనిమిది రుద్రాక్షమాలిక - ఉత్తమోత్తమము. వందపూసల మాలిక - ఉత్తమము, ఏబది రుద్రాక్షపూసల మాలిక మధ్యమము, ఏబది నాలుగు నక్షముల మాలిక-శ్రేష్టము. జపము సేయునప్పుడు ఎవరికిని మాలికఁ జూపఁగూడదు. గృహముల జపము-సమఫల ప్రదము, ఆవులుండు చోటున శతగుణకంబగును. పవిత్ర అరణ్యమున, ఆరామము నందును సహస్ర గుణంబు పుణ్యపర్వతము పైని జపము-పదివేల రెట్లును, నదీతీరమున లక్ష రెట్లును, దేవాలయమున కోటిరెట్లును, శివాలయమున ననంతముగను ఫలప్రదము నగును.

సూర్య అగ్ని దేవతా గురు బ్రాహ్మణులు చెంత నభి ముఖముగ కూర్చుండి జపించవలెను. జపించినపుడు క్రోధము గర్వము విడనాడవలెను. లేచుట, మధ్య మాట్లాడుట కూడదు. తుమ్ముట, ఉమ్మివేయుట, ఆవలించుటయు, కుక్కలు, నీచులు, పిల్లులు మున్నగువారినిఁ జూచుట చేయకూడదు. ఒకవేళ పొర పాటున పై దోషములు సంభవించునెడ ఆచమనముచేసి పార్వతీ పరమేశ్వర స్మరణము నొనర్పవలెను. లేదా! నక్షత్రములను సూర్యచంద్రాదులను దర్శింపవలెను. ప్రాణాయామమునైన గావించవలెను. ఆసనము లేకయు, పరుండియు, నడచుచు, నిలువఁబడియు, త్రోవలోను, అమంగళస్థలమునను, చీకటితో, కాళ్ళుచాపియు, పాదములపై కూర్చుండియు, వాహనముల నెక్కియు, మంచముపైనను, వ్యాకుల విచారమున శివ పంచా క్షరి జపము జపింపరాదు. అశక్తుడైనచో తన శరీర పరిస్థితినిబట్టి జపింపవచ్చును. పెక్కు చెప్పనేల? సదాచారమును అనగా, ఎవరిని తాకకుండ పరిశుభ్రతను (మడిని) పాటించుచు మంత్ర జపము ధ్యానించవలెను. ఇహపర శ్రేయస్సును పొందగలుగు దురు. మానవుడు అశక్తుడగునేని - ఒక్కప్పుడు వీలులేనిచో సదాచారమును తప్పినను భ్రష్టుడు కాజాలడు.

— * —

# భస్మ ధారణ విధి

భస్మమునకు విభూతి, భసితము, భస్మము, క్షారము, రక్ష యని ఐదునామములున్నవి. ఈ నామములు ఏర్పడుటకు ఐదు కారణములున్నవి. పరమేశ్వరుని సద్యోజాతముఖమున బుట్టిన నందగోవువలన కలిగిన భస్మము విభూతియనబడును. వామదేవ ముఖమున పుట్టిన భద్రయను గోవువలన సంభవించినది భసితమనబడును. అఘోరముఖమునుండి పుట్టిన సురభి వలన సంభవించినది భస్మమనబడును. తత్పురుష ముఖమున పుట్టిన సుశీలయను గోవు వలన గలిగినది. క్షార మనబడు. ఈశాన ముఖమువలన గలిగిన సుమనయను గోవువలన ప్రాప్తించినది రక్షయనబడును. ఈ విధముగా భస్మము ఐదు విధములైనది. పండితులు నిత్యకర్మములందు విభూతిని, నైమిత్తిక కర్మము లందు భసితమును, కామ్య కర్మములందు క్షారమును, ప్రాయశ్చిత్తాదులయందు భస్మమును, మోక్షాపేక్షాదులు కోరు వారు రక్షను ధరింపవలెను. విభూతి కపిల వర్ణము, సుభసితము కృష్ణవర్ణము, సుభస్మము శ్వేతవర్ణమును క్షార ఆకాశ వర్ణమును రక్షరక్త వర్ణమును కలిగియుండును. ఈ భస్మము నుత్పత్తి జేయుటకు కల్పము, అనుకల్పము, ఉపకల్పము, అకల్పము, అని నాలుగు విధములు, అందు మొదటి కల్పభస్మమే సర్వోత్తమ మైనది. అది లభ్యము కానప్పుడు తక్కిన మూటిలో నేదైన నుపయోగించవచ్చును. సద్యోజాత మంత్రముతో నేల బడకుండు నట్లుగా గోమయమును గ్రహించవలెను. వామదేవ మంత్రముతో

ఉండలుగా చేయవలెను. తత్పురుష మంత్రముతో ఎండబెట్టవలెను. అఘోర మంత్రముతో కాల్పవలయును. ఈశాన మంత్రముతో బిల్వాది ఫలముల యందుంచు కొనవలయును. కల్పకభస్మము అడవిలో నెండిన గోమయమును దెచ్చి పూర్వోక్త ప్రకారముగా మంత్రోచ్చారణముతో కాల్పగా సిద్ధమైనది అనుకల్ప భస్మము. అంగడియందు దొరకు భస్మము దెచ్చి గోమూత్రముతో మిశ్రమము జేసి పూర్వోక్త ప్రకారమున మఱగాల్చి సిద్ధము చేసినచో నది ఉపకల్ప భస్మము. జ్ఞానము లేనివారు యేదియో యొక విధముగా సిద్ధము చేసినది అకల్పభస్మము. ఈ నాల్గు విధముల భస్మము లను వేఱువేఱు పాత్రలలో నుంచుకొని, ఆవశ్యకతనుబట్టి యేదియో యొకదానితో దినమున ఒక మారయినను భస్మమును ధరించవలెను. ధారణ సమయమున శుభ్రముగా కాలు సేతులు కడుక్కొని ఎడమచేత విభూతిని గ్రహించి కుడిచేతితో మూసి మూలమంత్రముతో నెనిమిదిమాఱు లభిమంత్రించి ఈశాన మంత్రముతో శిరమున, తత్పురుష మంత్రమున ముఖమున, అఘోరమంత్రముతో హృదయమున, వామదేవ మంత్రముతో గుహ్యమున, సద్యోజాత మంత్రముతో రెండు పాదముల, ఓంకార మంత్రముతో సర్వశరీరమున భస్మమును చల్లుకొనవలెను. ఇది భస్మస్నానము, అన్ని స్నానములందు నిది శ్రేష్టతరము. అగ్ని సంబంధమైన యీ భస్మస్నానమున సమస్త దోషములును భస్మీ పటల మగును. జలస్నానాదులందు జీవహింస తప్పదు. కావున

జలస్నానముకన్న భస్మస్నానము మిన్న. బ్రహ్మాది దేవతలు, నారదాది మహర్షులు, సనకాది యోగులు, బాణాది దేవతలు శివ భక్తితాత్పర్యముతో నిత్యం భస్మస్నాన మొనరించి పాపవిముక్తిని పొందిరి.

"ఓం నమశ్శివాయ" అను మంత్రముతో భస్మమును ఏడు మాఱులు అభిమంత్రించి ఒడలిపై నలదుకొనవలెను. త్రిపుండ్రము లను ధరింపవలెను. శిరమున, నుదుట, కర్ణములందు, కంఠము నందు, భుజములయందు, హృదయమందు, నాభి, వెన్ను, రెండుబాహువులు, మూపు, మణికట్టులు అను నీ పదునైదు తావులయందు, మూలమంత్రములతో త్రిపుండ్రధారణము చేయ వలెను. ఆ మూడు వ్రేళ్ళతో ఎడమనుండి కుడివైపునకును బొటనవ్రేలితో కుడినుండి ఎడమవైపునకు త్రిపుండ్రమును దాల్చ వలయును. శివపూజ పరతంత్రులైన సాధకు లెల్లరును తప్పక యీ విధముగా భస్మధారణము జేయవలెను. నిత్యము నిట్లు చేయుటవలన సమస్త పాపములు నశించును. (సిద్ధాంత శిఖామణి నుండి)

— * —

## విభూతి మహిమ

పూర్వము భృగువంశమునందు జన్మించిన యొక బ్రాహ్మణుడు గొప్ప తపస్సు చేయుచుండెను. అతడు వైశాఖ

జ్యేష్ఠ మాసములందు పంచాగ్ని మధ్యమున, మార్గశిర పుష్య మాసములందు జలమధ్యమున, శ్రావణ భాద్రపద మాసములందు వర్షమున, బయలున నిలిచి ఘోరతపస్సు చేయుచు కందమూలాది ఫలములను తినుచుండెను. ఆయన క్రమక్రమముగా ఇతరాహారములను విడిచి ఆకుకూరలను తినుచుండెను. అందుచే ఆయనకు పర్ణాదుండను పేరు వచ్చెను.

ఈయన తపస్సుయొక్క వేడిమి ముల్లోకములందు వ్యాపించెను. ఒకనాడతడు దర్భలు కోయుచుండగా వ్రేలుతెగి రక్తము కారెను. అదిచూచి ఆకుపసరువలె నుండుట కనిపెట్టి తన తపస్సు ఫలించెనని సంతసించి ఆడుట కేకలువేయుట ప్రారంభించెను. వాని తపమునకు మెచ్చి వర మీయదలచి బ్రాహ్మణ రూపమున శివుడు వాని యెదుట ప్రత్యక్షమయ్యెను.

అప్పుడతడు వానిని జూచి కేకలు వేయుచు, గెంతుచు దూరముగా పోయెను. బ్రాహ్మణుడు వానికి దగ్గరకుపోయి చెయ్యి పట్టుకొని యిట్లనెను - ఓ పర్ణాదుడా ! ఏల యిట్లు బేలవై యఱచుచున్నావు, బహుశ్రమపడి సంపాదించిన తపోబలమును వ్యర్ధము చేయుచున్నావు. ఈ మానవదేహము భూమి వంటిది. భూమియందెన్ని రసములున్నవో శరీరమునందుగూడా అన్ని రసములున్నవి. సూర్యుడు, చంద్రుడు, అగ్ని మొదలగు దేవతలు ప్రభావము కలవారు కారా ? వారు నీవలె గర్వించినారా ? నీవేల అహంకారమును పొంది విఱ్ఱవీగెదవు ? నీ

వ్రేలువెంట శాఖరసము స్రవించినంత మాత్రమున ఇంత గర్వింప వలెనా? నా వ్రేలు విభూతికారుట చూడుము. అని తన వ్రేలు కోసికొని భస్మము ప్రసవింపఁజేసి చూపెను, దానిని జూచి పర్ణాదుడు తనకంటె నతడు గొప్ప తపశ్శాలియని భావించి వానితో నిట్లు చెప్పెను. "అయ్యా! మీరు గొప్ప తపశ్శాలివలె నున్నారు. మీ కులగోత్రాలతో మీ చరిత్రము సవిస్తరముగా చెప్పి నామనవి చెల్లింపుడు" అని మిగుల ప్రార్థించెను. అపుడు నిజరూపము జూపెను. చూచిన వెంటనే పర్ణాదుడు శివునికి సాష్టాంగ ప్రణామము చేసి పలువిధముల స్తుతించెను. వాని ప్రార్థనలకు సంతసించి శివుడు ఆతనికి వరమునొసంగెను. "ఓ పర్ణాదా! నీ స్తోత్రమునకు మెచ్చితిని. నీ కమరత్వమిచ్చితిని. నీకు మరి దుఃఖములుండవు. నీవు నా ప్రథమ గణములలో శ్రేష్ఠుడవు. నీవు మేరుపర్వతమున తపస్సు చేసికొనుచుండుము" అని చెప్పి ఆ దినము మొదలు శివుడు భస్మధారణము చేయుచుండెను. ఆపర్ణాదుని వలన భస్మ మీశ్వరునికి ప్రీతికరమయ్యెను.

ప్రయాగలో గంగా యమునా సరస్వతి పవిత్ర నదుల సంగమమందును పుష్కర ప్రభాస తీర్థములందును, స్నానము చేయుట వలన ఎట్టి ఫలము లభించునో భస్మ స్నానము వలన గూడా నంతఫలము లభించును. బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు మొదలగు దేవతలందరును భస్మస్నానము వలననే గొప్పవారైరి. భస్మము ధరించిన వారిని చూచి భూత ప్రేత రాక్షసులు

దూరముగా పారిపోవుదురు. వారికి యెట్టి కీడును చేయలేవు. భస్మము ధరించిన వారి కీశ్వరుడు సకలైశ్వర్యము లొసంగును. విభూతి గొప్ప మహిమ గలది.

అనేక శుభముల నొసంగు భస్మము రెండు విధములు. ఆద్దానిని చెప్పుచున్నాను. సావధానముగా నాలకింపుమని శంకరుడు భక్తులగువారికి చెప్పనారంభించెను.

మహా భస్మమనియు స్వల్పభస్మమనియు, రెండు విధములుగా నుండు విభూతి శ్రౌత లౌకికమనియు, స్మార్తమనియు రెండు తెఱఁగులయ్యెను. ఇతరులు శివనామమును స్మరించుచు విభూతి ధరించవచ్చును. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు మంత్రముల నుచ్చరించుచు భస్మము ధరించవలెను. త్రిపుండ్రములుగా ధరిఁపబడు విభూతికి కాల్చబడిన ఆవు పేడ ద్రవ్యంబగును. ఇద్దియే ఆగ్నేయ భస్మయనంబడు చున్నది. విత్యాగ్ని హోత్రముఁదగు విభూతినైనను తదితర యజ్ఞముల విభూతినైనను మూడు రేఖలుగా ధరించవలెను. జాబాలీ ఉపనిషద్గతములైన అగ్ని రిత్యాదిసప్త మంత్రములతో సజలమైన భస్మమును ధరించవలెను. అన్ని వర్ణములవారు సమస్త ఆశ్రమములవారును సమంత్రకముగా నైనను అమంత్రకముగానైనను ఉద్ధూళనమును త్రిపుండ్ర ధారణమును చేసికొనవచ్చును. ముముక్షువగువాడు ఉద్ధూళనమును త్రిపుండ్ర ధారణమును ప్రమాదమున గూడా విడువగూడదు.

మహేశ్వరుడు, విష్ణుమూర్తి, బ్రహ్మదేవుడు, పార్వతి, లక్ష్మి, సరస్వతులు, తదితర ఇంద్రాది దేవతలందరు, దేవర్షులు, మహర్షులు, సనక సనందనాది సిద్ధులు, సాధ్యులు, కిన్నర కింపురుషాదు లందరు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యశూద్రులు సంకరజాతివారు ఉద్ధూళనమును త్రిపుండ్రమును ధారణమును గావించుచున్నవారు. ఇవ్విధము శివుడు నొక్కి చెప్పెను. భస్మధారణ జేయనివారికి వర్ణాశ్రమాచార ప్రయుక్తమగు స్వధర్మము సిద్ధింపదు. కోట్లకొలది జన్మలయందును సంసారము నుండి విముక్తి చేకూరదు. శతకోటి కల్పములకైనను శివతత్వ జ్ఞానము కలుగజాలదు. భస్మధారణ రహితులు మహాపాపులని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి. అట్టివారు చేయు వ్రతోపవాసాది పుణ్యములు విపరీత ఫలము నొసగును. గొప్ప గొప్ప దురితములు నాచరించినవారికి శివద్వేషము గలవారికి త్రిపుండ్ర ధారణమునందు సేవగింపు గలుగును.

ఐతే ప్రతిదినము శివాగ్ని కార్యము నొనర్చి ఈ క్రింది మంత్రములతో భస్మమును చేతిలోనికి గ్రహించవలెను.

శ్లో॥ సద్యోజాతం ప్రపద్యామిసద్యోజాతాయవై నమోనమః
భవేభవే నాతి భవే భవస్వమాం। భవోద్భవాయనమః
వాసుదేవాయ నమో జ్యేష్ఠాయ నమః శ్రేష్ఠాయ నమో
రుద్రాయ నమః కాలాయ నమః కలివికరణా నమోసల
వికరణాయ నమో భలాయ నమో బలప్రమథనాయ

నమ సర్వభూత డమనయ నమో మనోన్మనాయనమః। అఘో రేభ్యో థఘోరేభ్యో ఘోర ఘోర తరేభ్యః॥ సర్వేభ్య స్సర్వ నర్వేభ్యో నమ స్తే అస్తు రుద్రరూపేభ్యః। తత్పురుషాయ విద్మహే। మహాదేవా య ధీమహి। తన్నోరుద్రః ప్రచోదయాత్॥ ఈశాన స్సర్వవిద్యా నామీశ్వరస్సర్వ భూతానాం బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధి పతి ర్బ్రహ్మాశివోమే అస్తు సదా శివోం॥

అగ్నిరితిభస్మ। వాయురితిభస్మ॥ జలమితిభస్మ। స్థలమితి భస్మ। వ్యోమేతిభస్మ। సర్వగ్ం హవా ఇదం భస్మ। మన ఏతాని చక్షూగ్ంషి భస్మాని॥

అను మంత్రములతో విభూతి నభిమంత్రించవలెను. "మానస్తోకి" అనెడి ఈ క్రింది మంత్రముతో చేతిలోనికి తీసు కొని నీటితో తడుపవలెను.

"మనస్తోకే" తనయే మాన ఆయుషిమానో గోషుమానో అశ్వేషురీరిషః వీరాన్మానోరుద్ర భామితో వధీర్ హవిష్యస్తో నమసా విధేమతేః। త్ర్యాయుషం"

అను ఈ క్రింది మంత్రముతోను త్ర్యంబక మంత్రము తోను మూడు రేఖలు ధరించవలెను.

మం॥ త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం।
ఉర్వారుక మివ బంధనాన్మృత్యోర్ముక్షీయమామృతాత్॥
యేతే సహస్రమయుతం పాశామృత్యోమ ర్త్యాయహంతవే।

తాన్ యజ్ఞస్యమాయయా సర్వానవ యజామహే ।
మృత్యవే స్వాహా మృతవే స్వాహా ॥

అని భస్మమును లలాటమందును. బాహువులందును, కుక్షి యందును. కంఠమునందును, హృదయమందును, శిరస్సునందును నుదుటిపై కనుబొమ్మలుదాటి ప్రక్కలకుగాని, క్రిందికిగాని ధరించ రాదని నియమము గలదు. భస్మధారణ ప్రయుక్త మంత్రములను తద్దేవతలను స్మరింపజాలనివారు "ఓంన్నమః శివాయ" అనుచు శివుని స్మరించుచు భస్మము ధరించవలెను.

మం॥ త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్యత్ర్యాయుషఃయద్దే
వానాం త్ర్యాయుషం తన్మే అస్తుత్ర్యాయుషం ॥

సమృద్ధిగా నుండి మన మనోదేహములకు సుఖశాంతుల నిచ్చి తద్వారా ఉపాసకునకు సౌలభ్యము కలుగజేయునని దీని వలన తేలినది. ఏనాడో యిట్టి విషయమును కనుగొని పురబాహ్య స్థానములుగా నిర్ణయించి. సంధ్యోపాసనకు సూర్యోదయాస్తమయ సమయములు చల్లని కాలమును నిర్ణయించిన ఋషులు కాధునిక విజ్ఞాన శాస్త్రజ్ఞు లెంతయో ఋణపడి యున్నారు. ఆ మునులు వంద నీయులు, వారికీ యాధునిక విజ్ఞాన శాస్త్రపరికరము లక్కరలేకుండ గనే ఋషులు తమ దివ్యజ్ఞాన సంపత్తిచేతనే యీ విషయమును కనుగొని లోకమును తరింపజేసినారు.

వేయేల ? బుద్ధిమంతులు నిత్యము విభూతిఁ దాల్చవలెను. శివలింగము నారాధింపవలెను. షడక్షరీ మహామంత్రమును జపించ వలెను (ప్రణవముతో కూడిన శివపంచాక్షరివి షడక్షరి యందురు. ఓంకారము లేనిది పంచాక్షరి యనబడును) భస్మధారిని దండించు వారు చండాల బీజమునుండి జన్మించినవారిని తెలియునది బ్రాహ్మణ క్షత్రియులు మానస్తోక మంత్రముతోడను వైశ్యులు త్ర్యంబక మంత్రము తోడను, శూద్రులు. వితంతు స్త్రీలును పంచా క్షరీ మంత్రముతోడను భస్మధారణఁ జేయవలసి యుండును. బ్రహ్మచారి - త్ర్యంబక మంత్రము వలనను, గృహస్థుఁడు - పంచ బ్రహ్మ మంత్రముల తోడను, వానప్రస్థుఁడు - అఘోర మంత్రమునను, సన్యాసి—ప్రణవమునను విభూతి రేఖలను మేనుఁదాల్ప వలసి యుండును.

అత్యాశ్రమియై శాంభవీ దీక్షితుండైన శివయోగి— యెల్ల పుడు ఈశాన మంత్రముతో భస్మము ధరింపవలెను. ఎవరును భస్మధారణమును మానగూడదని శివుడు శాసించి యున్నాడు. భస్మస్నానమున తనువునందు నిలచు భస్మకణములన్నియు శివలింగములనియే భావింపవలెను. తెలిసిగాని, తెలియకగాని ధరింపఁబడు భస్మము యగ్నివలె పావనంబగును.

భస్మమును ధరింపనిది రుద్రాక్షలను వేసికొనని ది నీటిచుక్కనైనను త్రాగరాదు. ఒక వేళ వట్లు చేసిన యెడల గాయత్రీ జపముతో శుద్ధియగును. యతులు ప్రణవజపమున పునీతులగుదురు. భస్మ త్రిపుండ్రములను విందించువారు శివుని

నిందించువారే యగుదురు. శివాలయములేని గ్రామము నివ సింపదగినదికాదు. శివారాధనలేని జన్మము వ్యర్థము, శివ జ్ఞానములేని యుపాసన సిద్ధింపదు.

మూడు లోకములు నాధారంబగు మహేశ్వరుని, రుద్రా క్షంకితునను భస్మరేఖలను లోకమునఁగల సప్తకోటి మహా మంత్రములతో శివపంచాక్షరిని జపము జేయుదురో వారి వంశ మున వేయిమంది పూర్వీకులను వేయిమంది తరువాత వారిని నధోలోకమునుండి యుద్ధరించుచు దీర్గవ్యాధులు లేనివారై సంపూర్ణ ముగా జీవించి అనాయాస మరణము నొందుదురు.

శ్రాద్ధమునందు, యజ్ఞమునందు, జపమునందు, హోమము నందు, వైశ్వదేవమునందు, దేవపూజనమునందును భస్మత్రిపుండ్ర ములఁదాల్చువారు అపమృత్యువులను తొలగించుకొందురు. జలస్నానము శరీరమైలను మాత్రము పోగొట్టును. భస్మ స్నానము బాహ్యాభ్యంతర శుచిత్వము నొందజేయును. మంత్ర స్నానమున పాపములు హరించును. ఉపాసనయను పరిశ్రమ మునఁజేసిన శివసాయుజ్యము చేకూరును.

భస్మధారణము లేనివారు చేసిన జపదానములు సిద్ధిం పవు. వానప్రస్థులు కన్యకలు, అదీక్షితులును మధ్యాహ్నము నకో ముందు తడిపిన భస్మమును తరువాత పొడి భస్మము ధరింపవలసి యుండును. భస్మరుద్రాక్షలు లేని జన్మము నిరుప యోగంబగునది, తలకాయ, నొసలు, చెవులు, కన్నులు

ముక్కు, నోరు, మెడ, రెండు చేతులు, మోచేతులు, చేతి మణి కట్టులు, హృదయము, రెండు ప్రక్కలు, బొడ్డు, నడుము, తొడలు, పిలమండలు, మోకాళ్ళు, పాదములు అను ముప్పది రెండు స్థానములు - భస్మధారణమునకు ఉత్తమంబులు.

శిరస్సు, లలాటము, చెంపలు, కంఠము, భుజములు, మోచేతులు, మణికట్టులు, హృదయము, నాభి, పార్శ్వద్వయము, వెన్ను అను పదునారు చోట్లు మధ్యమములు, లలాటము, చెవులు, భుజములు, హృదయము, గుహ్యము, నాభి, అను నెనిమిది భస్మధారణమునకు విహితస్థానములగుచున్నవి. ముత్తైదువులు భస్మము మూడు రేఖలుగా నొసట వెంట్రుకల వరకు ధరించి కుంకుమబొట్టు పెట్టుకొనవలెను. దైవభక్తిగల ప్రతి మానవుడును భస్మరుద్రాక్షలను ధరించుట, ధరించుట యందు ప్రవృత్తుఁడు కావలసియుండును. మనము బుద్ధిమంతుల మగుద మేని విభూతిగల నొసట చందనాదులు గలఁది కొనవలదు. ఒకవేళ శ్రీగంధాధులను స్వీకరించు నుద్దేశము ఉన్న యెడల భస్మముతో కలిపియే ధరింపవలెను. స్త్రీహత్య, గోహత్య, వీరహత్య, అశ్వహత్య, పరద్రవ్యాపహరణము, పరస్త్రీగమనము, పరనింద, ఇతరుల భూమి నపహరించుట, అకారణముగా నొరులను బాధించుట, పంటలు నెత్తికొని పోవుట, తోటలఁ బాడుచేయుట, ఇండ్లు కాల్చుట మున్నగు దుష్కృత్యములున్ను ఆవు, బంగారము, గేదె, నువ్వులు, గొంగళి వస్త్రములు, అన్నము, ధాన్యము, జలము

ర్వేద సామవేదములుగను. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులుగను భావించవలయును. ముక్తి కాముడయి భస్మమును ధరించువానికి జన్మరాహిత్యము కాగలదు. సకాముడు పూర్ణకాముడగును. బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు, అందరును భస్మము ధరించదగును. ఉపపాతకములు, మహాపాతకములు భస్మము ధరించుటచే నశించును. విధి తెలియని వారు శ్రద్ధా భక్తులతో ధరించినను ముక్తినొందగలరు. భస్మము. ఎన్ని పాపములనో నశింపజేయునుగాని, శివనిందయుఁ శివభక్తుని నిందయుఁ చేయు వారి పాపములు నశింపచేయదు, కంఠమున రుద్రాక్షమాలను, ఫాల మున భస్మముగలవాడు లోకపూజ్యుడగును. భస్మము ధరించుటచే సర్వతీర్థములందు స్నానముచేసిన ఫలము వచ్చును. అట్టివారి పితరులుగూడ తరించెదరు. భస్మము ధరించువారు ఇహలోకమున సుఖముగా దీర్ఘాయుష్మంతులయి జీవింతురు. భస్మ ధరించుటచే సమస్త వ్యాధులు నశించును. అట్టివారు దేహాంతమున విమానము నధిష్ఠించి స్వర్గము సత్యలోకము వైకుంఠము కైలాసమునకు వెళ్ళి అచ్చట శివునితో సాయుజ్యము పొందును.

—•••—

మున్నగు వానిని నీచులనుండి పరిగ్రహించుటయు. జాలరి వనిత లను, వేశ్యస్త్రీలను, చండాల తరుణులను శూద్రరమణులను నాట్య కత్తెలను, రజస్వలలను పెండ్లికాని కన్యలను విధవలను పొందు టయు మాంసము తోట, రసవస్తువులు, ఉప్పు అను వానిని దానము గ్రహించుటయు, కొండెములు చెప్పుటయు, కపటముగా మాట్లాడు టయు, తప్పుడు సాక్ష్యము. అబద్ధమాడుట అనునవి మొదలగు వివిధ అసంఖ్యాక పాపములు - పూర్వజన్మములయందు చేయ బడినవైనను ఈ జన్మలో పొరపాటున సంభవించినవైనను భస్మ త్రిపుండ్రములను ధరించుటవలన తత్కాలముననే నశించును.

శ్రీ సనత్కుమారులవారు శివుని సమీపించి సాష్టాంగముగ నమస్కరించి వినయముతో భస్మము ఎటుల ధరించవలయును అని మహాదేవుని ప్రశ్నించగా : శివుడిట్లు చెప్పెను. మంత్రములతో భస్మమును తీసికొని అందు నుదకముంచి దానివి అంగుష్ఠములతో కలిపి మూడు రేఖలుగ ముఖమున కనుబొమ్మలతో సమానముగా ధరించవలయును. మొదట మధ్యమ అనామికలలో రెండు రేఖల దిద్ది అంగుష్ఠముతో ఆ రెండు రేఖలును మధ్యనుండి మధ్యరేఖ భస్మముతో దిద్దవలయును. ఇట్లు చేయుటయే త్రిపుండ్రము అనబడును. ఇందులో మూడు రేఖలును వరుసగా అకార ఉకార మకారములుగను, గార్హపత్య దక్షిణాగ్ని ఆహవనీయములను త్రేతాగ్నులుగను, సత్వరజస్తమోగుణములుగను, ఋగ్వేద యజు

# బాలాశిషః

స్వాం శేనేదం తతం యేన సత్వమీశాత్రినందన ।
ముంచ ముంచ విపద్భ్యోముం రక్ష రక్ష హరే శిశుమ్ ॥
ప్రాతర్మధ్యందినే సాయం నిశి చాప్యన సర్వతః ।
దుర్ద్రుగ్గో ధూళి భూతార్తి గృహ మాతృగ్రహాధికాన్ ॥
ఛింది ఛింద్యఖిలారిష్టం కమండల్వారి శూలధృక్ ।
త్రాహి త్రాహి విభో నిత్యం త్వద్రక్షాలంకృతం శిశుమ్ ॥
సుప్తం స్థితం చోపనిష్టం గచ్ఛం తం క్వాపి సర్వతః ।
భో దేవావశ్వినా వేష కుమారో వామనామయః ॥
దీర్ఘాయురస్తు సతతం సహ ఓజో బలాన్వితః ॥

ఇతి బాలా శిషః

పిల్లలకు ఆరోగ్యముగా లేనప్పుడు ఈ పై శ్లోకములు 10 సార్లు పఠించి మంత్రించిన భస్మము రాయవలెను. ఆరోగ్యము కలుగగలదు.

ఇతి శ్రీ పరమహంస పరివ్రాజక శ్రీ వాసుదేవానంద సరస్వతీ విరచితం.

సమాప్తము.

# బిల్వ వృక్ష మహిమ

శ్రీ మహావిష్ణువు శ్రీ మహాలక్ష్మి శివునిగురించి తపస్సు చేయుచుండగా లక్ష్మీదేవి కుడిచేతి నుండి బిల్వవృక్షము పుట్టెను. విష్ణుమూర్తి యా బిల్వపత్రములచే శంకరుని పూజించగా శంకరుడు వారికి ప్రత్యక్షమై సర్వదేవోత్తమత్వము జగద్రక్షణ సామర్థ్యము వరంబుగా నొసంగెను. బిల్వమునకు శ్రీ వృక్షమని కూడా నామంబు వచ్చెను. వైకుంఠమున. మందర పర్వతమున, స్వర్గలోకమున, పుణ్యక్షేత్రములందు నీ వృక్షమును దేవతలు నాటిరి. నిత్యం శివలింగమును గాని, శ్రీ యంత్రమును గాని బిల్వదళములతో నర్పించువారు సకల పురుషార్థములు పొందుదురు. వారి దారిద్ర్యము నశించి యైశ్వర్యవంతులగుదురు.

పురుగులచే కొరకబడనివియు. లేతవైనవియు, మూడు దళములుగల బిల్వములచే శివుని పూజించినవారు శివసాయుజ్యము నొందుదురు.

బిల్వము - ఏకబిల్వము, త్రిదళము, పంచదళము అను భేదములచే గాన్పించుచున్నది. శివ స్వరూపుడగుటచే - ఏకబిల్వమనియు, త్రినేత్ర స్వరూప మగుటచే త్రిదళమనియు, సద్యోజాతాది పంచముఖ స్వరూపుడగుటచే పంచదళమనియు ప్రసిద్ధి వహించినది.

బిల్వము నధోముఖముగా పూజింపవలెను గాని, ఎటుల

నుత్పత్తి నొందినచో అటుల పూజింపకూడదు, తక్కిన పుష్పాదు లన్నియు ఎటుల ఉత్పత్తియో అటులే పూజ యొనర్పవలయును. బిల్వము పదిరోజుల క్రింద కోసినను పూజకు పనికివచ్చును. పుష్పము లేపూట పూచినవి - ఆ పూటనే గాని మరియొక పూటకు పనికిరావు. ఒక్క సోమవారమున కోసిన బిల్వపత్రి యా రోజు ననే పూజకు నుపయోగించును, గాని మరుచటికి నుపయోగింపదు. ఎండి పోయినదైనను - కొన్ని రోజుల క్రిందట కోసినవైనను బిల్వదళములు పూజకు పనికి వచ్చునని శాస్త్రములయందు గలదు. ఒకప్పుడు లక్ష్మీదేవి శ్రీ మహావిష్ణువును - ఏ పుష్పములచే పూజించిన శివుండు ప్రసన్నుండగును." అని యడుగ" కమలార్చన వలన ప్రసన్నుండగునని" యాతడు వచించెను, అంత లక్ష్మి సహస్రకమలములను తానే స్వయముగా కోసికొనివచ్చి లెక్కపెట్టి శివుని పూజించుచుండగా రెండు కమలములు తక్కువ య్యెను. అంతట లక్ష్మీదేవి ఆశ్చర్యమును పొంది ఒక స్తనమునుగోసి కమ లమునకు బదులుగా పూజించి రెండవది కోయబోవగా శివుండు ఆమె భక్తికి మెచ్చి ప్రత్యక్షమై వరంయిచ్చెను. అది మొదలు శ్రీఫలమని మారేడు వృక్షమునకు పేరువచ్చినది. భక్తిగలిగిఒకటి గాని, మూడుగాని,ఐదుగాని, ఆరుగాని, పదనొకండుగాని, ముప్పది ఆరుగాని, నూటఎనిమిదిగాని, ఆరునూర్లుగాని, సహస్రముగాని ప్రదక్షిణములు బిల్వవృక్షమును పూజించి చేసిన సర్వరోగములు నశించును. సర్వదుష్టగ్రహములు తొలగును, సంతానము కలుగును.

శివలింగము నభిషేకించి పూజించిన బిల్వతీర్థము పుచ్చుకొనిన యెడల - సమస్తపాపములు నశింపజేయును.

శివతత్వ సుధానిధియందు బిల్వమహిమ విశేషముగా వచింపబడినది. అనేక జన్మములవలన సంపాదించబడిన పుణ్యము వలనగాని, మానవులకు బిల్వపత్రములతో ఈశ్వరుని అర్చించే అదృష్టము కలుగదు. బిల్వదళములతో శివపూజ జేసిన వారికి తిరిగి జన్మలేదు. బిల్వపత్రములు లభించనపుడా చెట్టు క్రిందనున్న పవిత్రమైన మట్టితోనైనను కస్తూరి పొడివలె శివుని పూజింప వచ్చునని శాస్త్రప్రమాణము.

ఎవరు బిల్వవృక్షము క్రింద శైవుల భుజింపజేయునో అట్టి వారు శివలోకమును పొందును. ప్రాతః కాలమున బిల్వము సందర్శించి ప్రదక్షిణము చేసిన వానికి సర్వపాపములు నశించును. ఎవడు మారేడు దళములతో శివుని పూజించడో నూరేండ్లు బ్రతికినను వాని జన్మ వ్యర్థము. ఎవడు మారేడు దళములతో శివలింగమును నిత్యము పూజించునో వాడు మహదైశ్వర్యము నొందును. బిల్వమూలమున పంచాక్షరి జపము చేసిన త్వరలో మంత్రసిద్ధియగును.

బిల్వవృక్షమహిమ సమాప్తము.

— * —

# స్తోత్ర రత్నములు

## విఘ్నేశ్వర షోడశనామాని

సుముఖశ్చైకదన్తశ్చ కపిలో గజకర్ణకః
లమ్బోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః. 1

ధూమకేతుర్గణాధ్యక్షః ఫాలచన్ద్రో గజాననః
వక్రతుణ్డశ్శూర్పకర్ణో హేరమ్బస్స్కన్దపూర్వజః. 2

షోడశైతాని నామాని యః పఠేచ్ఛృణుయాదపి,
విద్యారమ్భే వివాహే చ ప్రవేశే నిర్గమే తథా. 3
సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య న జాయతే.

## శివమహిమ్న స్తోత్రమ్

మహిమ్నః పారం తే పరమవిదుషో యద్యసదృశీ స్తుతి ర్బ్రహ్మాదీనామపి తదవసన్నా స్త్వయి గిరః, అథావాచ్య స్సర్వ స్స్వమతిపరిణామావధి గృణన్ మమాప్యేష స్తోత్రే హర నిరప వాదః పరికరః. 1

అతీతః సంథానం తవ చ మహిమా వాఙ్మనసయో రతద్వ్యా వృత్త్యాయం చకిత మభిధత్తే శ్రుతిరపి, స కస్యస్తోతవ్యః కతవిధ గుణః కస్యవిషయః పదేత్వర్వాచీనేపతతినమనః కస్యన వచః 2

మధుస్ఫీతావాచః పరమమమృతం నిర్మితవత స్తవ బ్రహ్మన్

వాణ్యా అపి సురగురో ర్విస్మయపదమ్. మమత్వేతాం వాణీం గుణకథనపుణ్యేన భవతః పునాత్యస్మిన్నర్థే పురమథపబుద్ధిర్వ్యవసితా. 3

తవైశ్వర్యం యత్తజ్జగదుదయరక్షాప్రళయకృత్త్రయీ వస్తువ్యస్తం తిసృషు గుణభిన్నాసు తనషు. అభవ్యానా మస్మిన్ వరదరమణీయా మరమణీం విహంతు వ్యాక్రోశీం విదధత ఇహైకో జడధియః. 4

కిమీహః కిం కాయ స్సఖలు కి ముపాయ స్త్రిభువనం కి మాధారోధాతా సృజతికి ముపాధానఇతిచ, అతర్క్యైశ్వర్యే త్వయ్యనవసరదుస్థో హతధియః కుతర్కోయం కాంశ్చిన్ముఖర యతి మోహాయ జగతామ్. 5

అజన్మానోలోకాః కిమనయవవంతోపి జగతా మభిష్ఠాతారం కిం భవనిధి రనాదృత్య భవతి, అనీకో వాకుర్యాద్భువనజననేకః పరికరో భ వేన్మందాస్త్వాం ప్రత్యమరవర సంశేరతఇమే. 6

త్రయీ సాంఖ్యం యోగః పశుపతి మతం వైష్ణవమితి ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితిచ, రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిల నానాపథజుషాం నృణామేకో గమ్య స్త్వమసివయసా మర్ణవఇవ. 7

మహోక్షః ఖట్వాంగం పరశురజినం భస్మ ఖణివః కపాలం చేతీయ త్తవ వరదయంత్రోపకరణమ్. సురాస్తాం

తామృద్ధిం దధతి తు భవద్భ్రూప్రణిహితాం నహి స్వాత్మా రామం విషయ మృగతృష్ణాభ్రమయతి 8

ధ్రువం కశ్చి ద్భ్రూతే సకలమపర స్త్వధ్రువమిదం పరో ధ్రౌవ్యాధ్రౌవ్యేజగతి గదతివ్య స్తవిషయే. నమ స్తేఽప్యే తస్మిన్ పురమథనతై ర్విస్మ యఇవ స్తువన్ జిహ్రేమి తాం నఖలు ననుధృష్టా ముఖరతా.

తవైశ్వర్యం యత్నాద్యదుపరి విరించో హరి రథః పరిచ్ఛేత్తుం యాతావనల మనలస్కంధవపుషః తతో భక్తిశ్రద్ధా భర గురుగృహాణద్భ్యాం గిరిశయత్స్వయంతస్థే తాభ్యాం తవ కి మనువృత్తిర్న ఫలతి. 10

అయత్నా దాపాద్యత్రిభువన మ వైరవ్యతికరం దశాస్యో యద్బాహూనభృత రణకండూపర వశాన్, శిరః పద్మశ్రేణీ రచిత చిరణాంభోరుహబలేః స్థిరాయా స్త్వద్భక్తే స్త్రిపురహర విస్ఫూర్జిత మిదామ్. 11

అముష్యత్వ త్సేవాసమధి గతసారం భుజవనం బలా త్కైలాసేపి త్వదధివసతౌ విక్రమయతః. అలభ్యాపాతాళేప్య లసచలితాంగుష్ఠశిరసి ప్రతిష్ఠా త్వయ్యాసీద్ధ్రువ ముపచితో ముహ్యతి తతః. 12

యదృద్ధిం సుత్రామ్ణో వరద పరమో చ్చైరపి సతీ మధశ్చక్రే బాణః పరిజనవిధేయత్రిభువనః, నతచ్చిత్రం తస్మి

న్పరిపసితరి త్వచ్చరణ యోర్నకన్యా ఉన్నత్యై భవతి శిరస
స్త్వయ్య వనతిః. 13

అకాండబ్రహ్మాండక్షయ చకిత దేవాసురకృపా విధేయస్యా
సీద్యస్త్రినయన విషం సంహృతవతః కల్మాషః కంఠేన తన కురు
తేన శ్రియమహో వికారోపి శ్లాఘ్యో భువనభయ భంగవ్య ననినః.

అసిద్ధార్థానైవ క్వచిదపి నదేవాసురనరా నివర్తంకే విత్యం
జగతి జయినో యస్యవిశిఖాః సజానన్నీశ త్వామితర సురసాధారణ
మభూత్ స్మరస్మర్తవ్యాత్మా నహి వశిషుపథ్యః పరిభవః 15

మహీపాదామాతాద్వ్రిజతి సహసాసంశయ పదం విష్ణో
ర్భ్రామ్య ద్భుజపరిఘరుగ్ణగ్రిహగణమ్. ముహు ర్ద్యౌర్దౌ స్థ్యం
యాత్యనిభృతజటాతాడితతటా జగద్రక్షాయై త్వం నటసి ననువా
మైవ విభుతా. 16

వియద్వ్యాప త్తారాగణగుణిత ఫేనోద్గమరుచిః ప్రవాహో
వారాం యః పృషతలఘుదృష్టశ్శిరసితే. జగద్వీపాకారం జలధివల
యం తేన కృతమిత్య నేనైవోన్నేయం ధృతమహిమ దివ్యం తవ
వపుః. 17

రథః క్షోణీ యంతా శతధృతిరథేంద్రో ధమరథో
రథాంగే చంద్రార్కౌ రథచరణపాణి శ్శరఇతి. దిరక్షో స్తే

కోయం త్రిపురతృణమాడంబరవిధిర్విధేయైః క్రీడంత్యో నఖలు ధలతంత్రాః ప్రభుధియః. 18

హరిస్తే సాహస్రం కమలబలిమాధాయ పదయోర్యదే కోనే తస్మిన్నిజ ముదహర న్నేత్రకమలమ్. గతో భక్త్యుద్రేకః పరిణతి మసౌచక్రవపుషాత్రయాణాం రక్షాయై త్రిపురహరజాగర్తి జాగతామ్. 19

క్రతౌ సుప్తే జాగ్రత్త్వమసి ఫలయోగే క్రతుమతాంక్వ కర్మప్రధ్వస్తం ఫలతి పురుషారాధనమృతే, అతస్త్వాం సంప్రేక్ష్య క్రతుషు ఫలదానప్రతిభువం శ్రుతౌ శ్రద్ధాంబధ్వా దృఢపరికరం కర్మసు జనః 20

క్రియాదక్షో క్రతుపతి రధీశ స్తనుభృతా మృషీణా మార్త్విజ్యం శరణదసదస్యా స్సురగణాః. క్రతు భ్రేష్టస్త్వత్తః క్రతుషు ఫలదానవ్యసనినో ధ్రువం కర్తుః శ్రద్ధావిధుం మభిచారాయ హి మఖాః. 21

సతాం వర్త్మత్యక్త్వా శ్రుతిసమధిగమ్యం సహాభువం ఘృణామప్యున్మూల్య స్వజనవిషయన్స్నే హగుణితామ్, ద్విజః కృంతన్నాదె పితర మపరార్థాంత్వాయి విభోమనుష్యత్వం సద్యస్త్రి దశపరిణామేన విజహౌ. 22

ప్రజానాథం నాథ ప్రసభమధికం స్వాం దుహితరం గతాం దెహోద్భూతం రమయితుమదృశ్యస్య వపుషా. ధను

ష్వాణేర్వ్యాతం దివమపి నవత్రాకృతమముం పరిత్ర స్తం తం తే
త్యజతినమృగవ్యాధరభసః 23

స్వలావణ్యాశంసాధృత ధనుషమహ్నాయ తృణవత్పుర
ప్లష్టం దృష్ట్వా పురమథనపుష్పాయుధమపి, యది స్త్రైణందేవీయ
మని రత దేహార్ధ ఘటనాదవై తిత్వా మద్ధావరద ముగ్ధా
యువతయః 24

స్మశానేష్వాక్రీడాస్మరహర పిశాచాస్సహచరా శ్చితాభస్మా
లేపః స్రగపి నృకరోటీపరికరః, అమంగళ్యం శీలం తవ భవతు
నామైన మఖిలం తథాపి స్మర్తృణాం వరదపరమం మంగళ
మపి. 25

మనః ప్రత్యక్చి త్తేసవిధమవధాయా త్తమరుతః ప్రహృష్య
ద్రోమాణః ప్రమదసలిలోత్సంగితదృశః యదాలోక్యాహ్లాదం
హ్రదఇవ నిమజ్యామృతమయే దధత్యంత స్తత్త్వంకిమపి యమి
న స్తత్కిల భవాన్. 26

త్వమర్క స్త్వం సోమ స్త్వ మసి పవన స్త్వం హుతవ
హ స్త్వ మాప స్త్వం వ్యోమ త్వము ధరణిరాత్మా త్వమితి చ,
పరిచ్ఛిన్నామేవం త్వయి పరిణతా బిభ్రతి గిరం నవిద్మ స్త త్త్వం
వయమిహతు య త్త్వం న భవసి. 27

త్రయీం తిస్రోవృ త్తీ స్త్రిభువన మథో త్రీనపి సురానకా
రాద్యై ర్వర్ణైస్త్రీభి రభిదధ త్తీర్ణ వికృతి. తురీయం తే

ధామ ధ్వనిభిరవరుంధానమణుభి స్సమ_స్తం వ్య_స్తం త్వాంశరణద గృహాణాత్యోమితి సతమ్. 28

భవ శ్శర్వోరుద్రః పశుపతి రథోగ్రస్సహా మహా_స్తథా భీమేశానా వితి యదభిధానాష్టక మిదమ్. అముష్మి న్ప్రత్యేకం ప్రవిచరతి దేవశ్రుతిరపి ప్రియాయాస్మై ధామ్నే ప్రణీహితన మస్యోస్మిభవతే. 29

నమో నేదిష్ఠాయ ప్రియదవవిష్ఠాయచ నమో నమః క్షోదిష్ఠాయ స్మరహరమహిష్ఠాయచ నమః నమో వర్షిష్ఠాయ త్రినయన యవిష్ఠాయ చనమో నమస్సర్వస్మైతే తదిదమతి శర్వాయ చనమః. 30

బహుళ రజసే విశ్వోత్పత్తౌ భవాయ నమోనమోజన సుఖ కృతే సత్వోద్రేకే మృడాయ నమోనమః, ప్రబలతమసే తత్సం హారేహరాయ నమోనమః ప్రమతివిపదేని స్త్రైగుణ్యే శివాయ నమోనమః. 31

కృశపరిణతిచేతః క్లేశవశ్యం క్వచేదం క్వచ తవగుణసీ మోల్లంఘినీ శశ్వదృద్ధిః, ఇతి చకిత మమందీకృత్య మాంభ_క్తి రాదా ద్వరద చరణయో_స్తే వాక్యపుష్పోపహారమ్. 32

అసితగిరిసమం స్యాత్కజ్జలం సింధుపాత్రే సురతరువర శాఖాలేఖినీపత్రముర్వీ. లిఖతి యది గృహీత్వా శారదా సార్వకాలం తదపి తవ గుణానా మీశ పారం నయాతి. 33

వపుః ప్రాదుర్భావాదనుమితమిదం జన్మ న పురాపురారే న క్వాపిక్షణమపి భవంతం ప్రణతవాన్, నమన్ముక్తస్సంప్రత్యహ

మతసురగ్రేష్యనతి మా నితీశ క్షంతవ్యం తది దమపరాధద్వయ 34
మపి.

అసురసుర మునీంద్రై రర్చితస్యేందుమౌళే గ్రథితగుణ
మహిమ్నో నిర్గుణస్యేశ్వరస్య. సకలగుణవరిష్ఠః పుష్పదంతా 35
భిధానో రుచిర మలఘువృత్తైస్స్తోత్రమేతచ్చకార.

అహరహరనవద్యం ధూర్జటేస్తోత్ర మేతత్పఠతిపరమ
భక్త్యా శుద్ధచిత్తః పుమాన్యః సభవతి శివలోకే రుద్రతుల్య స్త 36
థాత్ర ప్రచురతరధనాయుః పుత్త్రవాన్ కీర్తిమాంశ్చ.

దీక్షాదానం తపస్తీర్థం యోగహోమాదికాః క్రియాః 37
మహిమ్నః స్తవపాఠస్య కళాం నార్హంతి షోడశీమ్.

మహేశాన్నాపర దేవో మహిమ్నో నపర స్తవః అఘో 38
రాన్నాపరో మంత్రో నాస్తితత్త్వం గురోః పరమ్.

అసమాప్తమిదం స్తోత్రం పూజ్యగంధర్వభాషితమ్. సమా 39
నం మనోహారి శివ మీశ్వరవర్ణనమ్.

కుసుమదశననామా సర్వగంధర్వరాజః శశిధరవర మౌళే
ర్దేవ దేవస్య దాసః సగురునిజమహిమ్నో భ్రష్టఏవాస్య రోషాత్ 40
స్తవన మిద మకార్షీ ద్దివ్యదివ్యం మహిమ్నః

సురవమునిపూజ్యం స్వర్గమోక్షైకహేతుం పఠతియతి
మనుష్యః ప్రాంజలి ర్నాన్యచేతాః వ్రజతి శివసమీపం కిన్నరై
స్తూయమానః స్తవన మిదమమోఘం పుష్పదంత ప్రణీతమ్. 14

